సంపుటము 2]    మార్చి 1916    [సంచిక 9




# బా ల మి

## తండ్రియొక్క ప్రేమ



ఒకానొక పట్టణమునం దొక దట్టమయినట్టి అడవియును, ఎత్తయిన శిఖరముగల ఒక పర్వతముండెను. ఆ పర్వత శిఖరముమీద ఒక భయంకరమయిన పక్షి వసించుచుండెను. దాని యాహార మేమనగా ఆ పట్టణములోని చిన్నపిల్లలను, చిన్నదూడలను ఎత్తుకొనిపోయి ఆ శిఖరముమీద పెట్టుకొని తినుచుండును.

ఇట్లుండగా ఆ ఊరిలోనున్న ఒక కుటుంబమువారు చాలా బీదవారును, సంతానములేనివారును దైవభక్తి గలవారై యుండిరి. వారు దేవుని ప్రార్థింపగా ఒక చక్కనికుమారుడు పుట్టెను. ఒక్కనాటి ఉదయమున తండ్రి యేదో ఒకపనిమీద ఒక సమీపగ్రామమునకు వెళ్లెను. తల్లి ఆ కుమారుని మంచెముమీద పరుండబెట్టి ఆ మంచమును బయట నుంచి పక్షివిషయము మరచి నీళ్లకు బోయెను. ఆ పక్షి యెక్కడనుండియో చూచి అతివేగముగా వచ్చి ఆ పిల్లవానిని తన్నుకొనిపోయెను. ఆ పిల్లవానిని గోళ్లలో నిరికించుకొని చచ్చునట్లు ముక్కుతో పొడుచుచు బాధ పర్చుచున్నందున ఆ పిల్లవాడు అరచుచుండెను. పిల్లవాని తల్లిదండ్రులయొక్క బీదతనమునకు పురజనులు జాలిపడి, పిల్లవాని చక్కదనమునకు వారు చాలా సంతోషించుచు ముద్దులాడుచుండిరి. అందువల్ల ఆ పిల్లవానియొక్క యేడ్పును చూచి వారు గుర్తుపట్టిరి. తత్క్షణమే కొందరు బలవంతులు బయలుదేరి వానిని విడిపించుటకుగాను పక్షివెంబడి పరుగెత్తిరి. ఆ పక్షి ఆ శిఖరముమీదకు ఆ పిల్లవానిని తీసికొనిపోయి దానిపై బెట్టి ముక్కుతోపొడిచి బాధించుచుండెను. వారును అక్కడికి చేరిరి, పిల్లవానియొక్క బాధనుచూడలేక ఒక బలవంతుడు ఆ పక్షియొద్దకుపోవ యత్నించెను. కొంతదూరము

ఆ పర్వతము ఎక్కిపోగా ఆ పక్షి యితనిని పొడవ నారంభిం చెను గాన తాళలేక క్రిందికి దిగివచ్చెను. నేనుపోయి విడి పించగలనని యింక ఒక బలవంతుడుపోయి మొదటివాని వలెనే పోలేక బాధలకు తాళలేక క్రిందికి దిగివచ్చెను.

ఈ సంగతి యిట్లుండగా ఈ సంగతియంతయు తండ్రికి తెలిసెను. అతడు పరుగెత్తుకొనివచ్చి నేను నా కుమారుని రక్షించగలను అనిపోయి ఎన్ని బాధలు కలిగినను, పక్షి ఎంత పొడిచినను, వీని నన్నిటినోర్చి చివరకు ఆ పక్షిని జయించి తన కుమారుని క్రిందికి తీసికొనివచ్చి క్రిందపరుండబెట్టి పిల్లవానివంకచూచి కన్నులవెంబడి నీళ్లువిడిచి ప్రాణములు బాసెను.

ఆహా! చూచితిరా సహోదరులారా! తండ్రియొక్క ప్రేమ ఎటువంటిదో? లోకములోని వారందరి కొరకును క్రీస్తు ఈ విధముగానే చచ్చెనుగదా? మనము ఈ లోక మను పట్టణములో నుంటుండగా సైతాను అనుపక్షి ఎవరిని ఎత్తుకొనిపోదునా ఎవరిని ఎత్తుకొనిపోదునా అని తిరుగుచు మనలను ఎత్తుకొని పోయెను. ఇది చూడలేక అనేకులు రక్షింప ప్రయత్నించిరిగాని లాభములేకపోయెను. చివరగా తండ్రి యేవిధముగా వచ్చి ఆ పిల్లవానిని రక్షించెనో ఆ విధ ముగానే మనమందరము సైతానువారమై యుండగా దేవుని

కుమారుఁడును మన ప్రభువయిన క్రీస్తు ఈ లోకమునకు మనుష్యరూపమునుదాల్చి తన తండ్రియొద్దనున్న మహిమను పోగొట్టుకొని పాపులమయిన మనకొరకు సిలువమ్రానుమీద మేకులతో కొట్టబడి బల్లెముతో ప్రక్కనపొడిచి చంపబడెను గదా? ఆహా! క్రీస్తుస్వామియొక్క ప్రేమ ఎంతగొప్పది? రక్షించువారు క్రీస్తుకుతప్ప మరెవరున్నారు! తక్కినవారందరు మనుష్యమాత్రులే.

"కనుక మనము పాపమను బంధకమునుండి విడిపించబడితిమి." ఆయనయొక్క తండ్రిభావమే దీనికి కారణము.

---

# బ్రాహ్మణదంపతులును, ముంగిసయును

## పాట

తోహరా

బ్రాహ్మణు లిద్దరు పెన్మిటిభార్యయు బిడ్డలులేకనువారు।
మోహముతో నొక ముంగిపోతును ఆదరించుకున్నారు॥

2. కొంతకాల మిటు జరిగినవెనుక నొక కొమరుడు వారికిపుట్టెన్।
తల్లిదండ్రులు సంతసంబుతో తనయునిసాకుచురాగన్॥

3. నూతికి నీళ్లకుబోవదలచి తనపతినిబిలిచి యిట్లనెను।
ముద్దులబిడ్డను కాయుచునుండుము, ముంగిస కరువకయుండన్॥



4. అంతలోన యా బ్రాహ్మణు డప్పుడు యేగెను వేఱొకచోటన్ ।
సంతసంబుతో సర్పంబొక్కటి చనువుగ నింటిలో దూరెన్ ॥

5. ముంగిస పామును జూచిన వెంటనే ముక్కముక్కలుగజేసి ।
గుమ్మమెదుటను నిలిచియుండె తనయమ్మకొరకు తావేచి ॥

6. ముంగిసమూతిని రక్తముండగా సంగతితెలియక యామె ।
బిందెనెత్తి తా తలపైవేసెను చిందులు ద్రొక్కుచు నామె ॥

7. యింటిలోనికి వెళ్లిచూడగా చంటిబాల బాగుండెన్ ।
"అయ్యో" ముండమోపినై చంపితినంచును మూల్గుచు తానపుడేడ్చెన్ ॥

8. గాన మనము యేకార్యమునైనను పూని చేయకను వేగా ।
ధ్యానము తోడుతచేయగవలయును ధరణిలో ఎపుడును బాగా ॥

---

# శరీరము, మనస్సు

దేవుడు మనుష్యుని జేసినప్పుడు ఏవిధమగు పొరబాటును జేయులేదు. బహు విచిత్రమగు శక్తిని గల్గిన మనస్సు యొక్క ఏర్పాటుల ప్రకారము చేయునట్లుగా శరీరమందలి అవయవముల నన్నిటిని ఆయన జేసెను. మనము బలము గలిగి బాగుగానుండి, మన పనులను ఈ లోకమందు చక్కగా జేసికొనునట్లు ప్రతి అవయవమునకు ఒక మంచిపని పెట్టెను. ఏనుగుయొక్క దేహము చాల పెద్దదియు, బలముగలదియు నైయున్నదిగాని, మనుష్యుని మనస్సు అందులో ఉండి పని జేయుటకు వీలుగానంత బరువైనదియు, మురికిదియునై యున్నది. పురుగుల దేహములు మిగుల నేర్పరితనముతో జేయబడినవి గాని అవి చాల చిన్నవి. ఈ లోకములో మనుష్యుని శరీరమును మనస్సును కలిసి ఎంత ఒద్దికగా నున్నవో అంతగా ఏ ప్రాణిలోను లేదు.

---

# ఒక కుక్కయొక్క పెద్ద ప్రయాణము

ఒకడు ఒక మంచి జాతి కుక్కను కొని రైలుమీద దానిని తన సామానుతో కూడ నెక్కించి మెడపట్టీకి గొలుసు

తగిలించి బండిలో కట్టివేసి బయలుదేరెను. వారు చేర వలసిన చోటికి చేరినప్పుడు కుక్క బండిమీదనే ఉండెను.



దాని యజమానుడు సామాను తీసికొనివచ్చి చూచినప్పుడు కనుపడకపోయెను. అతడును, బండివాడును దిగులుపడిరి. మెడపట్టి తగిలించబడిన గొలుసు అదేలాగు ఉండెను. దానిని బట్టి వారా కుక్క యేలాగు తప్పించుకొనెనో తెలిసికొనిరి.

ఆ ఊరిలోనే అతడు నాలుగు దినములుండి ఊరంతా వెదకెను. వర్తమాన పత్రికలలో దానిగూర్చి ప్రచురించెను దాని జాడ తెలియనేలేదు. 57 దినములైన పిదప అతనికి ఆ కుక్క పాత యజమానునినుండి తంతి వర్తమానము వచ్చెను. కుక్క క్షేమముగా వచ్చిచేరినది. చాల బడలి నట్లున్నది. కాళ్లు చాల నొప్పిలాగు కనుబడుచున్నది. అను కబురు దానియందుండెను. ఆ రెండు పట్టణములకు 975 మైళ్ల దూరము. అది దినమునకు సరాసరిని 17 మైళ్ల చొప్పున ప్రయాణము చేసినది.

## మేరీ ఇచ్చినదేమి?

పండ్లు వచ్చుచున్న తన చిన్ని చెల్లిని జాగ్రతగా పరామర్శించుటకు ఒక గంటకాలము నిచ్చెను.

చేపలను పట్టగోరిన మూడు సంవత్సరముల ఈడుగల తన చిన్ని తమ్మునికి దారము, వంచిన పిన్నును, మంచి సలహాను ఇచ్చెను. ఇంటియొద్ద జబ్బుగానున్న బిడ్డను చూచి వచ్చుటకు తమ యింటి పనికత్తె సుబ్బమ్మకు ఒక గంటకాలము నిచ్చెను. ఆ గంటకాలము సుబ్బమ్మకు ప్రాణపదముగా నుండెను. ఎందుకనగా సుబ్బమ్మ విధవరాలు. ఆమెకు ముసలి

తల్లి గలదు. తమకు కావలసిన భోజనమునకై ఈమె పాటుపడవలసియుండెను. మేరీ ఆమెకు బదులుగా ఇంటిని ఆ గంటకాలము కనిపెట్టి యుండనియెడల, సుబ్బమ్మ తన బిడ్డను తరుచుగా చూడ తటస్థింపదు.

మేరీ యిచ్చిన దింతేకాదు ఆమె బాగుగా తల దువ్వుకొని శుభ్రమైన బట్టలు ధరించి, తల్లి తనవైపు చూచినప్పుడెల్లను సంతోషకరముగాను దయగాను, సహాయకరముగాను కనుపడినందున తల్లికెంతో ఆనందము కలిగించెను.

దూరముననున్న ఊరికి ప్రయాణమైపోయిన తండ్రికి మంచి ఉత్తరము వ్రాసి సంతోషమునిచ్చెను.

ముసలవ్వ కథ చెప్పుచుండగా శ్రద్ధగా నాలకించి, అది ముగించగానే ఆ అవ్వకు సంతోషము కలుగునట్లు ముద్దిచ్చెను.

ఈలాగున ఆమె తనయొద్ద నొక ఎఱ్ఱని యేగానియైనను లేకున్నప్పటికి ఒక్క దినములో ఆరుగురికి మిక్కిలి విలువగల బహుమతు లియ్యగలిగెను.



# ప్రకృతి పాఠములు

iii భాగము

**20-వ పాఠము**

## రక్తమేలాగున కలుగుచున్నది?

ఇదివరకు రక్తమువలన ఏయే పదార్థములు చేయబడుచున్నవో తెలిపితిని. ఇప్పుడు రక్తమేలాగు కలుగుచున్నదో తెలిసికొనుటకు కొందరు కోరవచ్చును. చెప్పెదను వినుడి.

నీ శరీరములోని రక్తము నీవు తిను భోజనమునుండి చేయబడినవి. మొక్కలోని రసమేలాగున చేయబడినదో ఆలాగుననే రక్తమును చేయబడెను. ఇది విపరీతముగా కనబడవచ్చునుగాని ఈ సంగతి నిజమైనది. మొదటిభాగములో మొక్కమొక్క భోజనము భూమియందున్నదనియు, మొక్కమొక్క వ్రేళ్లు దాని నోళ్లనియు చెప్పియుంటిని జ్ఞాపకమున్నదా? భూమియందున్న భోజనమును వ్రేళ్లలోని నోళ్లు పీల్చుకొనును. వీటివలెనే, నీ కడుపునందున్న చిన్న నోళ్లు నీవు తిను ఆహారములోని మంచి సారమును పీల్చుకొనును. ఇట్టి నోళ్లు నీకుమాత్రమేగాక అన్ని జంతువులకును ఇట్టి నోళ్లు బహుగా ఉన్నవి.

రక్తమువలన నెన్నివిధములగు వస్తువులు చేయబడు చున్నవో చూచితివిగదా. అది చాల చిత్రమని తలంచు చుండవచ్చును. నీవు తిను భోజనము అంతా ఒకటిగానే ఉన్నదా? ఎన్ని రకముల భోజనము తినుచున్నావు? తలంచుము. బియ్యము, మాంసము, గుడ్లు, ఉప్పు, ఉల్లిపాయలు, మిరపకాయలు, రకరకముల పండ్లు, రకరకముల కూరగాయలు లెక్కపెట్టుటకు వీలుగానన్ని ఉండవచ్చును. మన శరీరములో ఎర్రగానున్న రక్తమిన్ని తరహాల పదార్థముల నుండి చేయబడినదనుట మరీ చిత్రముగా నుండునుగదా.

వేరువేరు మృగములలోని రక్తము వేరువేరు పదార్థముల నుండి కలిగినవి. ఆవు మాంసము తినదు. దాని కడుపుకది పట్టదు. కుక్క గడ్డిగిట్టదు. ఈలాగున ఒక జంతువు తిను పదార్థము లొక జంతువు తినదు. దేని కడుపుకేది సరిపడునో, అది ఆ వస్తువులు తినులాగున దేవుడు ఏర్పరచియున్నాడు. మన రక్తము అనేక పదార్థములనుండి కలుగుచున్నది. మన మెన్నిరకముల తిండి తిందుమో అన్ని రకము లే ప్రాణియు తినదు.



# బైబిలు పిల్లలు

## మోషే



బాలమిత్రులారా! మీ రిదివరకు యోసేపు అన్నయగు లేవీనిగురించి చదివియున్నారు గదా! నేనిప్పుడు లేవీ మనుమడగు మోషేను గురించి మీకు తెలుపబోవుచున్నాను.

మోషేయొక్క తల్లిదండ్రుల పేరులు యోకెబెత్తు, ఆమ్రాములు. వీ రెట్లు ఐగుప్తునకు వెళ్లిరో ఇదివరకే తెలిపి

యున్నాను. యోసేపు జీవించినంతవరకు ఇశ్రాయేలీయులనబడిన యాకోబు సంతానీకులు ఎట్టివిధ చింతలేక సుఖముగా నుండిరిగాని యోసేపు మరణానంతరము యోసేపు నెరుగని యొకరాజు ఆ దేశమును పరిపాలించుట తటస్థించెను. ఆ క్రొత్తరాజు మిగుల త్వరగా సంతానాభివృద్ధి జెందుచున్న ఇశ్రాయేలీయుల జూచి, వారు తన శత్రువులకు సాయముచేసి, కొంతకాలమైనతర్వాత ఐగుప్తు నాక్రమించుకొనుదురేమో అని తలచి, వారిని మొదటనుండి కనిపెట్టిచూచి, రానైయున్న విపత్తుల తప్పించుకొన కొన్ని ప్రయత్నములు జేసెను. అవి ఏవనగా, వారికి అధికపనులు చేయునట్లు నియమించుట, వారికి కలుగు మగశిశువు పుట్టగానే చంపివేయుట మొదలగునవి. పాపము! ఆ దౌర్భాగ్యులైన ఆ ఇశ్రాయేలు స్త్రీలు, తమ ముద్దుబిడ్డలు చంపబడుట జూచి ఎంతగా పరితపించిరో! తల్లిశోకము పరులకు తెలియునా? పలువిధ శ్రమలకోర్చి, నవమాసములు మోసి, పుత్రదానమునొంది సంతసించుచుండవలసిన తల్లి, తనప్రియబిడ్డడు బలవంతముగా చంపబడుట చూడవలసివచ్చెను. ఎంతమంది తల్లులు తమ ఘోష, కష్టదుఃఖ పరిహారకుడగు ప్రభువున కెరింగించుకొనిరో?

ఇట్టి విపత్సమయమున యోకెబెత్తునకు ఒక సుందర బాలుండు గలిగెను. ఇంతకుముందు ఆమెకు తొమ్మిదేండ్ల ప్రాయపు ఆడపిల్ల, మూడేండ్లప్రాయపు పిల్లవాడు ఉండిరి. అయిననేమి కన్నతల్లి బిడ్డలున్నారని ఒక బిడ్డను పోగొట్టుకొన ఇష్టపడునా! ఈ నూతన బాలుని మూడుమాసములవరకు జాగ్రత్తగా కాపాడెను. ఫరో నియమించిన రాజభటులు ఎల్లయెడల సంచరించుచు సోదా జూచునపుడు యోకెబెత్తు తల్లడింపింతయని జెప్ప నేరికివశము! భక్తిపరురాలగు నీమెను కష్టకాలమున, ఆపత్బాంధవుడగు భగవంతుడు చేయివదలడు గదా? బిడ్డ గొప్పపనిజేయుటకు సృజింపబడినవాడు. కాన ప్రభువు ప్రతిసమయమందును బిడ్డను మిగుల జాగ్రత్తతో కాపాడుచుండెను. కొన్నిమాసములైన పిదప తల్లి, ఈ బిడ్డను రహస్యముగా దాచి తనపనుల జేయుటకై పోవలసి వచ్చెను. అంత నీమె ఒక చిన్న జమ్ముపెట్టెనల్లి క్రింద కీలు పూసి నైలునదీతీరంబునపెట్టి తన కొమరియగు మిరియమును కావలి యుంచెను. నైలునదీతీరము గొప్ప హానికర స్థలమని తల్లి ఎరిగినను, తనబిడ్డ సర్వేశ్వరునిహస్తముల సురక్షితముగా నున్నాడని తలచి నెమ్మదిగా యుండునది.

(సశేషము)

# బాలమిత్ర టపా




ప్రియ బాలమిత్రులారా!

## నేను మీతో ఒక కథ చెప్పగోరుచున్నాను

ఇంగ్లీషువారిలో ఒక సామ్యముకలదు దానిభావమేమన: మేలుకు ప్రతిగా కీడుచేయుట పిశాచములకు తగినది. కీడుకు ప్రతిగా కీడుచేయుట మృగములకు తగినది. కీడుకు ప్రతిగా మేలుచేయడము దైవమునకే తగినది.

అయితే ఈ దిగువను అవతరించబోయేవిఘము. నోరులేని జీవము కీడుకు ప్రతిగా మేలుచేయుట చూడగా మనుష్యులలో అపకారమునకు ప్రత్యుపకారము చేయుటయందు సంతోషించేవారి ప్రవర్తనకు ఇది ఎంత

భేదముగా కనబడునో కొద్ది విద్యగల సోదరినైన నేను వ్రాసి చూపించబోవు చున్నాను.

“ఫ్రాంసుదేశపు రాజధానియగు పారీసు పట్టణములో ఒకడు తన పెంపుడుకుక్కను, ఇకమీదట ఉంచుకొనుటకు ఇష్టములేక దానిని, ఏవిధముగానైనా పోగొట్టవలెనని నిశ్చయించెను. ఒకనాడు దానిని, ఒక చిన్న డింగీలో, వెంటబెట్టుకొని, ఒక నదిమీద, సగముదూరమునకు వెళ్లి, అక్కడ లోతున దానిని, డింగీమీదనుంచి నీళ్లలో పడవేసెను. అంతట ఆ కుక్క నీళ్లలోపడి కొట్టుకొనుచు, ఆ డింగీని పట్టుకొనవలెనని, అతి కష్టముతో ప్రయత్నములు చేసెనుగాని, ఆ దురాత్ముడు అవి దగ్గిరకు రాగానే, పదే పదే దానిని కొట్టుచువచ్చెను. అయితే ఆ కుక్క వీని దురాలోచన తెలియక యింకా డింగీనే కలుసుకొనవలెనని వెంటదగిలి, యీదులాడుచు వచ్చుచుండగా వాడు దానిని ముంచివేయవలెనని, యత్నించుచుండగా, అకస్మాత్తుగా ఆ డింగీ ఒరిగి తలక్రిందుబోయెను. వాడు నీళ్లలోపడి యీదలేక మునుగుచు తేలుచు, కొట్టుకొనుచుండెను. ఇది, ఆ జాలిగల కుక్క చూచి, వెంటనే, తన యజమానునియొద్దకువచ్చి, వాని నోటితో కరచిపట్టి, నీళ్లలో మునగకుండా కొంతసేపువరకు, పైకి ఎత్తిఉంచెను. ఈలోగా అక్కడ ఒడ్డున నున్నవారెవరోవచ్చి, వాని ప్రాణమును రక్షించెను. ఆహా మనుష్యునికంటె ఈ నోరులేనిజంతువు ఎంత విశ్వాసముగలది.”

గేరా కాంతమ్మ,
రెండవతరగతి,
నల్లపాడు,
గుంటూరుతాలూకా

C. L. S. PRESS, MADRAS—1916